# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 మే 1979 సంచిక 5

విషయానుక్రమణిక



---

**చందాదారులు గమనించండి!**

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితములోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-6-1979" అనియుండిన, మీ చందా జూన్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) మే నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

-: శ్రీవారి కార్యక్రమములు :-

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అటలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

మతము యెన్నటికినీ వ్యక్తిగతము కాదు. యెవరి నమ్మకము వారిదే అగుటచే యెవరి ఆచరణ వారిదే గనుక మతమొక రీతిగా వ్యక్తిగతము కావచ్చునేమో. యెంతవరకు అనగా సనాతన సాంప్రదాయములను ఉల్లంఘించనంత వరకూ: కానీ దేవుడు, మతము, వర్ణములూ లేవను బుద్ధిమంతులు తాము విశ్వసించిన దానితో తృప్తిపడియుండుట మనకు కానరాదు. ఎందుకన, దేవుడు లేడనికానీ, కర్మకాండ మూఢ విశ్వాసమని కానీ అనువారు అనేకమంది మనకు కనుపించుచున్నారు. అట్టివారు కేవలము యేమీ తెలియనివారు కారు. లేక విద్యలేని వారలు కారు, అన్నీ తెలిసినవారు, గొప్ప విద్యావంతులు. అట్టివారు మూఢ విశ్వాసములని చెప్పుటలో వున్న అంతరార్థమేమిటి? అంత మాత్రముతో వూరకుండిన కొంతనయమే. మౌనము వహించిననూ సంఘమున కేనష్టమూ వుండదు. కానీ అట్లువారు వూరకుండుటలేదు.

చిన్న ఉదాహరణము. మత్తుపదార్థములైన కల్లు, సారాయి త్రాగుట వ్యక్తిగతములే. కాని అవి వ్యక్తిగతములని ఇతరులు హర్షించుచున్నారా? హర్షించరు కదా? ఎంత వ్యక్తిగతములని సమర్థింప బూనిననూ ఆదుశ్చర్యలు సూక్ష్మముగనో, స్థూలముగనో, సంఘముపై తమ ప్రభావమును ప్రతిక్రియా రూపముగ చూపక మానవుకదా? జనసామాన్యము యిట్లు వ్యవహరించిన అంతబాధ కలుగదు. కానీ సంఘములో, సమాజములో, పేరెన్నికగన్న పెద్దలిట్లు వ్యవహరించిన జనసామాన్యము

వక్రమార్గము పట్టుదురు. వ్యాస వాల్మీకాదులు రచించిన గ్రంథములు బహు పురాతనములు. కావుననే వాటికి పురాణములని పేరు వచ్చినవి. చిరకాల జననములైననూ వృద్ధాప్య మనునది వాటి నంటజాలకున్నది. అట్లు కాని పక్షమున ఆసేతుహిమాచలము వానిని కాంక్షించి చుండెడి వారుకారు. గ్రంథములన ఇట్లనిరి. యవ్వనములో గతము, వర్తమానము, భూతమను విచక్షణ రహితముగ యెవ్వరు, యెప్పుడు, యెచ్చట కావించిననూ ఆనందసాగరమున ముంచునవిగ నుండవలెను.

సృష్టియందు, మనుధర్మశాస్త్రమును బోలు గ్రంధము ఇంకొకటి కానరాదు. యేకాలమున, యెవ్వరైననూ అట్టి గ్రంథమును సృజింప గలరా? హైందవ సిద్ధాంతములు కానీ, శాస్త్రములు కానీ, భౌతిక విజ్ఞాన శాస్త్రములకు లొంగునవికావు. భౌతిక విజ్ఞాన శాస్త్రవిజ్ఞానము దినదినాభివృద్ధి నందుచున్నది. కానీ నిన్నటి సిద్ధాంతమును నేడు ఖండించు నూతన సిద్ధాంతములను లేవనెత్తుచున్నారు. ఇట్లయిన నిత్య సత్యములగు శాస్త్ర సిద్ధాంతములను భౌతిక విజ్ఞాన శాస్త్రముతో యెట్లు పరీక్షింపనగును? గ్రుడ్డి నమ్మకముపై ఆధారపడక కేవలము పరీక్షలకు దిగి శాస్త్రరీతిగా పరిశీలించి సర్వ విషయములు శోధించుచుంటిమని నేటి శాస్త్ర వేత్తల అభిప్రాయము, ఇదంతయూ స్వతంత్ర విచారణ అని వారి భ్రాంతి. ఇది సత్యముకాదు. మనము క్రొత్త సిద్ధాంతమును లేవ తీయ నవసరములేదు. సర్వమూ సిద్ధమైయున్నది గ్రహించుటే మన కర్తవ్యము.

పాశ్చాత్య వేదాంతులైన కాంటు మొదలు కొని, స్పెన్సర్ వరకు విచారించిన అంశములు ద్వైత్వ, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతముల లోని తుంపరులు. హిందువులు సర్వవిషయము లను ఇదివరకేవిచారించి సిద్ధాంతీకరించిరి. వైదిక మతము, హైందవ మతము వర్ణాశ్రమాచార ధర్మములపై ఆధారపడియున్నది. కానీ, మత మందు వర్ణమును, విషయము. వేదాంతము నందు మాయ యను పదము సామాన్యముగ అలక్ష్యము, విసుగుగను, నిరసనమునకును, విమర్శకును గురి అగుచున్నవి. వర్ణ భేదములు మానవ కృతములనియు, ప్రత్యక్షముగా దృశ్యగోచరమై అనుభవనీయమగు జగత్తు మాయయని అనుటయు శుద్ధ అవివేకమని కొందరు తీర్మానించుట, విమర్శించుట జరుగు చుండును.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టా గుణకర్మ విభాగశః" అను స్మృతియు, బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూరాజన్యః అను శ్రుతియు పరమేశ్వర కృత వర్ణ విభాగ సూచితములని చెప్పుట తటస్థించిన యెడల వాని అర్ధ తాత్పర్యములు వేరొక విధముగ అన్వయింపబడుట తటస్థించుచున్నది. కావున అసలు వర్ణములను సవి యున్నవా, వర్ణమనగా యేమి అను సందేహములను విచారించుటకైనా ప్రయత్నించు చున్నారా? లేదు. వర్ణమనునది వక పదము

ప్రతి పదమునకూ వకొక్క అర్థము కలదు. అందువలన వర్ణమను పదమునకు కూడా వక అర్థము వుండవలెనుకదా! వృక్షమునకు వృక్షమను శబ్దమే ప్రమాణము. పదమనగా శబ్దము. యేనుగునకు యేనుగను శబ్దమే ప్రమాణము. ఇదే విధముగ పిల్లి, కుక్క, నక్క అను మాటలను తెలుపగనే ఆయా శబ్దములయొక్క అర్థములని ఆయా రూపములను గ్రహింతుము. ఆ శబ్దములు మనకు పూర్వమే యున్నవి. శబ్ద జాలములోనే మనము పుట్టితిమి కానీ శబ్దాన్ని మనము పుట్టించలేదు, శబ్దమును సృజించుకొనెదమనిననూ నలుగురు చేరవలెను కదా! ఇందులకు ముందుగ ఇట్టి మాటలుండియుండవలెనుకదా! ఇట్టి మాటలకు అర్థములు కూడా వుండి యుండవలెనుకదా! కాన పదములనూ వాటి అర్థములను మనము నిర్ణయించు కొంటిమను మాట అసంభవమని గ్రహింతురుగాక, మాటలు, వాటి అర్థములు మనము పుట్టక పూర్వమే కలవు. అందులో మనకు కావలసిన మాటలను వుపయోగించు కొనుచున్నాము. వాక్కనగా మాట, లేక పదము. పదముల యొక్క అర్థములే సృష్టిలోని విషయములు. అందులకే సృష్టిలోని వస్తుజాలములకు పదార్థములు అని పేరు వచ్చినది. పదార్థములు అనగా పదములు వాని అర్థములు. గుట్ట అను పదము దానికి యెదురుగా వున్న కొండయే. కుండ అను వక పదమునకు మట్టితో చేయబడిన వక ఆకారము, దాని అర్థము.

అటులనే, బ్రాహ్మణ వైశ్య శూద్ర అను పదముల అర్థ సూచితములగు మానములు వుండవలదా? యెవరు బ్రాహ్మణులు, యెవరు కాదు అను ప్రశ్న ఇచట ఆ సందర్భము, పదము, దాని అర్థము కలదని నిరూపించు ఘట్టమిది అని గ్రహించవలెను. కావున ప్రపంచ మంతయూ పదములు వాని అర్థములు అని తేలుతున్నది. పదమునకు పర్యాయ పదము నామము. అర్థమనగా రూపము. యేతావాతా ప్రపంచమనగా నామ రూపములన్న మాట. కనుకనే ప్రపంచమంతయూ నామ రూపములు తప్ప అన్యములేదు.

శ్రుతి కూడా అటులనే తెలిపినది. "వాచారంభణం వికారో నామధేయం" అనగా వాక్కు దానియొక్క అర్థము. శివపార్వతుల వలే, జడ చైతన్యములవలే, బింబ ప్రతిబింబములవలే చంద్రుడు, చంద్రిక వలే ఈ రూపనామములు అవినాభావ సంబంధములు. రెండునూ విడదీయ రానివై యున్నవి. లోక వ్యవహారమునకు వాక్కే ప్రధానము. అదే మూలము. ఈ వాక్కునకు ఆధారము భావము, భావమునకు ఆధారము అనుభవము. అనుభవమునకు ఆధారము కోరిక. కోరికకు ఆధారము అజ్ఞానము.

అజ్ఞానమన్ననూ, మాయ అన్ననూ, అవిద్య అన్ననూ, ప్రకృతి అన్ననూ వక్కటే. అయితే ఈ అవిద్య, మాయ, అజ్ఞానము, ప్రకృతికి పరమాత్మయే ఆధారము. పరమాత్మ పరంజ్యోతి, జ్ఞానజ్యోతి, దివ్యజ్యోతి. స్వయం

జ్యోతి, అట్టి స్వరూపుడైన పరమాత్మను ఆధారము చేసుకున్న అజ్ఞానము, మాయా ఇత్యాది అవిద్యలు మనలను ఆవరించవు. జ్యోతి ఉన్నచో చీకటికి స్థానము లేదుకదా. జ్ఞానమున్న అజ్ఞానము ఆవరించదు కదా! కనుక అతడే "బహుస్యాం" అను మనోభావముతో జగతును రచించినాడు. శ్రుతి ననుసరించి నామరూపములు యేర్పాటు చేసినాడు. మానవుడు శబ్దములను, అర్థములను సృజించుట అనునది హాస్యాస్పదము. సర్వశక్తివంతుడైన పరమాత్మనే ఇట్టి శక్తిని అర్థమునూ యేర్పరచును. అతనినే పరమాత్మ అని అంటున్నాము. దేవుడు కలడా లేడా అను ప్రశ్నకు ఏకైక జవాబు దేవుడు కలడని ఋజువు చేయుటకు దేవుడను పదమే, శబ్దమే ప్రధాన ప్రమాణము



# సాయికల

కలల్లో భగవాన్ బాబాను చూస్తున్నా, నాకు అలాటి కలలపైన నమ్మకం వుండేదికాదు. భగవాన్ బాబా వారే నాకు నిర్ధారణగా చెప్పితే ఆకలను నమ్మగలను. లేకపోతే నాకు కలల విషయంలో పూర్తి నమ్మకం ఏర్పడలేదు.

దీనికి కారణం కలల్లో కనిపించేది యథార్థంగా జరగకపోవటం. నాకు వచ్చే కలలు నా ఆలోచనల మీద ఆధారపడి వస్తూ వుంటాయనీ, వాటికీ యథార్థతకూ సంబంధం వుండదనీ నా నమ్మకం.

ఎలా జరిగితే బాగుంటుందో అలా జరుగుతున్నట్లు కూడా కలలు వచ్చేవి. కాబట్టి నా ఆశలూ, అభిప్రాయాలూ, కలలుగా కనబడుతూ వుంటాయనే నా నమ్మకం. నాలోని స్వాప్నిక భావాలే నా స్వప్న లోకంలో కనిపించేవి. అవి వాస్తవ జగత్తులో ఎందుకూ ఉపయోగపడనివి.

ఇదే రీతిగా నేను భగవాన్ బాబాను గూర్చికూడా ఎక్కువగా ఆలోచిస్తూ వుంటాను. కనుక నా భావాలకు అనుగుణంగా బాబా కనిపించుతూ వుంటారనే నా నమ్మకం. అవి బాబా సంకల్ప ఫలితంగా వస్తాయంటే నాకు నమ్మకం లేకపోయేది.

నాకు వస్తున్న ప్రతి కలలోనూ నేను ఏదో ఒక ప్రముఖ పాత్రవహిస్తూ వుంటాను. నా కలల్లో ఇదొక విస్మయావహమైన విశేషం.

స్వప్నం—స్వప్నాన్ని చూచేవాడు ఈ రెండింటిలోనూ చూచేవాడు లేకుండా స్వప్నం వుండబోదు. 'నేను' అనబడే వాడు చూచేవాడు. ఈ 'నేను' అనువాడే జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో మూడింటిలోనూ వుంటాడు." అంటూ స్వామి వివరిస్తారు. 'నేను' లేని స్థితిని పతంజలి వివరించుతారు. ఈ 'నేను' లేని స్థితిని అనుభవించే ఆధ్యాత్మిక ఉన్నతి నాకు సాధ్యం కానిది! ఈ విషయంలో నాది పుస్తక జ్ఞానమే.

ఈ 'నేను' లేకుండా నాకు సృష్టి లేదు. సర్వ కాలములలోనూ, సర్వావస్థలలోనూ, సర్వ ప్రదేశాల్లోనూ ఈ 'నేను' వుంటూనే వుంటుంది. దీన్నే 'అహం' అంటారు. ఈ అహాన్ని స్వామి చాలవరకు తగ్గించినా, ఇంకా నాలో మిగిలేవుంది.

వేసవి తరగతుల తర్వాత స్వామిని గూర్చి ఆలోచిస్తూ, ఇతరులకు చెబుతూవున్నా నా కలల్లోకి స్వామిరాలేదు. సాధారణంగా నా భావాలే నాకు స్వప్నాలవుతాయి కదా; అలా కూడా జరగటం లేదు. ఒకరోజు నాకు ఒంట్లో బాగుండలేదు. ఇక స్వామిని గూర్చి ఆరోజు అసలే ధ్యాసపోలేదు. అయినా ఆ రాత్రి నాకు కలలో స్వామి కనిపించారు.

మాయింట్లో పై అంతస్థులో నా పఠన - పూజా మందిరం. స్వామి నేను కూర్చునే కుర్చీలో కూర్చున్నారు. ప్రక్కనేవున్న టేబులు నిండా కాగితాలూ, చెత్తావున్నాయి. లేచినిలబడ్డాను. "భగవాన్, మీతో పర్తిలో వుండగా నాకెంతో హాయిగా వుంటుంది. ఇక్కడికి (త్రివేంద్రం) వచ్చాక నాకేం బాగుండటం లేదు. ఈ (Table) టేబులు చూడండి. అసహ్యంగా అస్తవ్యస్తంగా వుంది. ఈలాటి దుస్థితి నుంచి నేను బయట పడేదేప్పుడు?" అని నేను స్వామిని అడిగాను.

భగవాన్ అన్నారు. : "అవును. అందుకేగా నే వచ్చింది" అని.

నేను : "భగవాన్! మీ మీద నేను చాలా పాటలు వ్రాశాను. అవి బాగున్నయ్యా? మీ అభిప్రాయం?"

భగవాన్ : (గ్రామఫోన్ రెకార్డ్ చెప్పినట్లు స్వామి కంఠ స్వరంలో ప్రేమ ప్రతిధ్వనిస్తోంది)" అలాటి ప్రశ్న ఎందుకు అడుగుతావు ? నీచేత వ్రాయించింది నేను కదూ! నీ ప్రశ్నకు అర్థంలేదు.

(కొంచెంసేపు నేను మౌనంవహించాను.)

నేను : "నాపట్ల మీ రెంతో ప్రేమగా, దగ్గరగా ఇప్పుడున్నారు కదా! కానీ నేను పుట్టపర్తి వస్తే ఒక్కోసారి నావంక కన్నెత్తి అయినా చూడరు. నన్ను ఒక్క పెట్టరు. ఇలా ఎందుకు చేస్తారు?"

భగవాన్ : "అలాటి ప్రశ్న ఎందుకు వేస్తావు? ఎవరిని గానీ ఎందుకు నిర్లక్ష్యం చేస్తాను ? నిజానికి నేనూ నీవూ ఒకటేగా. అలాటప్పుడు నిర్లక్ష్యం చేసే ప్రసక్తేలేదు. నీవిలా ఆలోచించుతున్నావా?"

"సత్యమేదో అసత్యమేదో విమర్శించి వేరుచేసే వివేకం నీలో కలగాలి. ఇప్పుడు కలవుంది. కల కలగా తీసుకుంటే అది నిజమే అనిపించుతుంది. వాస్తవంతో పోలిస్తే అది నిజంకాదు. ఈ వాస్తవికత సాపేక్ష్యమైనటు వంటిది. పరమ సత్యంతో పోలిస్తే ఈ 'వాస్తవ' ప్రపంచం కూడా నిజంకాదు. నీ చుట్టూగల ఈ ప్రపంచం వాస్తవమని నీవు అనుకుంటావు. అదినిజం కాదు. అదీ కలవంటిదే. పరమ సత్యం అనేది నీ ఆత్మ సందర్శనం వల్లనే తెలుస్తుంది. గుర్తుంచుకో."

కల అయిపోయింది.

ఈ కలను అంత తేలిగ్గా కొట్టిపారవేయ లేకపోతున్నాను. ఈ కలలో గల భావ గాంభీర్యంచేత ఈ కలను అంగీకరిస్తున్నాను. నమ్ముతున్నాను. లోగడ నేను కోరుకుంటే వచ్చేటి కలవంటిది కాదిది! ఈ కల ఇలా రావటంనాకే ఆశ్చర్యం కలిగించుతుంది.

యస్. శంకర్
(1978, వేసవి తరగతుల విద్యార్థి)

# అళికెయందు అమృతోపన్యాసము

(భగవాన్ బాబాగారు 29-1-79 సాయంకాలం 6 గం॥లకు అళికెయందు బహిరంగసభ ప్రారంభమున ఇచ్చిన దివ్యోపన్యాసము)

సంగ్రహణం - 'సాయి చరణ్'

చంద్రునికి కలువయే శృంగారం
సూర్యునకు తామరయే శృంగారం
సముద్రమునకు తరగలే శృంగారం
స్త్రీకి గుణమే శృంగారం
గగనమునకు చంద్రుడే శృంగారం
దైవ భక్తునకు విభూతియే శృంగారం.

సర్వరూపధరం శాంతం సర్వనామధరం శివం
సచ్చిదానందరూప మద్వైతం సత్యం శివం సుందరం

దివ్యాత్మ స్వరూపులైన ప్రధానోపాధ్యాయ, ఉపాధ్యాయులారా! విద్యార్థినీ విద్యార్థులారా! విద్యాపోషకులారా! విద్యాభిమానులారా!

నానా లౌకిక కోలాహలములతో నిండిన నగర సముద్రము నందు సంసార నౌకలో పయనించు వ్యక్తులకు ఆధ్యాత్మిక జ్యోతి, నావికులకు గమ్యస్థానమును చూపించు లైట్‌హౌసు లాంటిది, దీనిని ప్రతి వ్యక్తి తెలిసి కొనవలసివుంది.

ఆకాశమున సంచరించు మేఘములు వాయువేగము వలన ఒకదానిలో ఒకటి కలుసుకొనుట ఒకదాని నుండి మరొకటి విడిపోవుట జరుగును. అదే విధముగ కాల నిర్ణయము వలన ఈ ప్రపంచమున సంయోగ వియోగములు జరుగుచుండును. కాలాన్ని తను అదు పాజ్ఞలలో వుంచుకొనుట ఎవరికి సాధ్యం కాదు. "కాలయనమః, కాల కాలాయ నమః కాలాతీతాయ నమః కాలరక్షాయ నమః" అని స్తుతిస్తాము. కాలం పరమాత్మ స్వరూపం. మానవుడు దేశకాల పరిస్థితులకు, ప్రభావమునకులోనై అనేక సుఖములను కోరి అవి దొరకకపోవుటవలన నిరాశకు గురియగును. ఇట్లు మానవుడు నిరంతర తాపత్రయమునకు చిక్కి అందే జీవితము ముగించు కుంటున్నాడు. అందువలన మనము జీవితపు నిజమైన కర్తవ్యమేమిటి యని ఆలోచింపవలయును. ప్రపంచం విశాలమైనది. కాలం అనంతం. ఈ శరీరం అశాశ్వతం. అనిత్యమైన, అసత్యమైన ఈ శరీరమును సార్థకం చేసికొనుటకే మానవ జీవితం లభించింది. ఎనభై నాలుగు లక్షల జీవుల యందు జన్మ మనుష్య మిక్కిలి పవిత్రమైనది.

ఈ మనుష్య జన్మే ఏవిధంగా పవిత్రమైనది? ఆహార, నిద్రాభయ, మైథునములు సర్వజీవులకు సమానధర్మములు. "జ్ఞానం నరాణాం అధికం విశేషం జ్ఞానే విహీనః పశుభిః సమానః" జ్ఞానంవలన మాత్రమే మనుష్యులకు జంతువులకంటె విశిష్టస్థానం లభించింది. మన జీవితాన్ని సార్థకం చేసుకోవాలంటే మనం ప్రజ్ఞాన విజ్ఞాన సుజ్ఞానములను పెంచుకొనవలయును.

ధర్మరాజు చక్రవర్తి. అతని తమ్ముడైన అర్జునుడు దేవేంద్రుని కుమారుడు. అతని ధరించిన ఆ యుధము గాంఢీవం. అతనికి సహాయము చేసినవాడు బుద్ధిబల

శాలి, భుజబలశాలియైన భీమసేనుడు. అర్జునుని సారథియైన చక్రపాణి సాక్షాత్తు భగవంతుడు. ఇంతటి సహాయ ముండి కూడా పాండవు లెందుకు అంతటి కష్టముల పాలైనారు? దీనికి కారణమేమిటి? దీని అంత రార్థమేమిటని ప్రతి యొక్కరు ఆలోచించాలి. ఏ సమయమున ఏ కాలమున ఎవరికి ఎంతటి పరిస్థితి యుంటుందన్నది ఎవరూ చెప్పలేరు. దీని కంతా దైవమే కారణం. కార్యకారణ కర్తవ్యములకు అనుగుణంగా మనమీ శరీరమును ధరించినాము. మనమీ శరీర సహాయముతో పరమాత్మ అనుగ్రహము పడయువరకు ఇది పవిత్రంగా వుంటుంది.

పరమాత్మ ఎక్కడున్నాడు ? అతడు అంతటా నున్నాడు. అతనిని సర్వాంతర్యామి, సర్వభూతాంతర్యామి అని పిలుస్తారు. అతడెవరు? నిజానికి ప్రేమే పరమాత్మ. అందరి యందు ప్రేమ వుంది. వ్యక్తిగత బాంధవ్యము, సంబంధమునందు కనిపించు ఈ ప్రేమ ఈ ప్రపంచమున మిక్కిలి సంకుచితత్వమును పొందినది. ప్రతియొక్కడు ఈ ప్రపంచమున ఏదో ఒక విధముగ ఆనందమును పొందవలయునని భావిస్తాడు. అది ఎటువంటి ఆనందము. ఆహార, నిద్రా మైథునముల వలన లభించు ఆనందమే నిజమైన ఆనందమని అనేకమంది భ్రమిస్తున్నారు. ఇంకా కొంతమంది ధన, కనక వాహనాది సంపదల పొంది సుఖించాలని ఆశిస్తారు. కానీ ఈ జగత్తునందు పవిత్రమైన, సార్థకమైన, పరమాత్ముని చేరుటకు అనుకూలమైన జీవనమే, త్యాగముతో కూడిన జీవనముగు చున్నది. "నకర్మణా, నప్రజయా, ధనేన, త్యాగేనైక అమృతత్వ మానుషః"అనునది ఉపనిషత్ వాక్యము. సాంసారికి బంధముల వలన పరమాత్మ తత్వమును తెలుసుకొనుట సాధ్యము కాదు. ఈ సంసార బంధములను పూర్తిగా తెంచుకొని పరమాత్మ స్వరూపమును మనసు నందుంచు కొన్నప్పుడు మాత్రమే నిజమైన ఆనందమును పడయుటకు సాధ్యమగును.

ద్వారకా వాసులందరూ శ్రీకృష్ణునితోనే "కృష్ణా నీవు నా బంధువవు, నాకు ఆప్తబంధువవు, నా రక్త సంబంధానివి"అని చెప్పుచు తాము శ్రీకృష్ణుని బంధువుల మను గర్వముతో నుండిరి. అయితే వీరికి ఏంగతి పట్టింది? ఈ యాదవులందరూ ఒకరినొకరు కొట్టికొని తమ కులాన్నే నాశనము చేసికొనిరి. అయితే గోపికలు అట్లా అనలేదు. "పరమాత్మా మేము నీ వారము. కృష్ణా మా హృదయం నీది. మా ధన కనక వస్తు వాహనాదులు, శరీరము నీది. మేమంతా నీ వారం" అని చెప్పుటవలన వారు అర్పణ స్థితిని పొంది తమ జీవితమును సార్థకము చేసికొనిరి. ఈ అర్పణ స్థితియే మిక్కిలి ప్రధానమైనది.

ప్రపంచంలో అనేకమంది ధనవంతులున్నారు : కాని ఏం ప్రయోజనం? పోయేప్పుడు ఒక పిడికెడు మన్ను కూడా తమ వెంట తీసుకపోజాలరు. అందు వలన మన దగ్గర వున్న ధన కనక వస్తు వాహనాదులు గాలికి చెదరి పోవు మేఘముల వలె అస్థిరమైనవి. ఇట్లుండగా మనము మనుష్యులై పుట్టియు నిజంగా ఏంచేయున్నాము? మనదేహాన్ని సంసారాన్ని పోషించుకొనుటకు కాలాన్ని వ్యర్థం చేసుకొంటున్నాం. కాలాన్ని నిరర్థంగా కడపిపుచ్చుట నిజంగా మంచిది కాదు. మనము పొందిన ఈ శరీరాన్ని పరమాత్మ సేవకు అర్పించాలి. అప్పుడు జీవనం సార్థక మవుతుంది.

శ్రీ నారాయణ భట్టు విషయంలో అనేకులు అనేక విషయాలకు వర్ణిస్తుంటారు. ఇది నిజమైన ఒక ప్రేమ తత్వముకాదు. నారాయణ భట్టు ఇంతవాడు, అంత వాడు అని పొగిడితే చాలదు. అతనిపై నిజమైనప్రేమ వున్నవారు అతని ఆదర్శాలను ఆచరణలో పెట్టాలి. అప్పుడు వారు శ్రీనారాయణభట్టు యొక్క నిజమైన సోదరులు, నిజమైన అభిమానులు, నిజమైన బంధువులు అవుతారు. నేడుండి రేపు నశించునది ఈ శరీరం. దీనిని ఇదే స్థితియందుంచుకొనుట సాధ్యం కాదు.

జీవితకాలంలో పవిత్రమైన కర్మకే మనము నమస్క-రించాలి. "తస్మై నమః కర్మణే"అని ఉపనిషత్తులో చెబుతారు. మనము పెద్దవారికి సమస్కారం చేసినా చేయక పోయినా, భగవంతునికి నమస్కారం చేసినా చేయక పోయినా మనము నిత్యము ప్రతియొక క్షణమందు చేయు కర్మకు నమస్కరించే తీరాలి. ఈ కర్మమే మన సుఖదుఃఖములకు మూలకారం, మనం ఎంత కర్మ చేస్తామో అంత ఫలితాన్ని పొందుతాము. ఎటువంటి తిండి తింటామో అటువంటి తేన్పులే తేన్చుతాము. ఏ విత్తనాన్ని విత్తితే అదే వృక్షము పుడుతుంది. అందువలన మంచి పనులు చేయడానికి మనుష్యుడు ప్రయత్నించాలి, నిజంగా మనుష్యుని వలె పుట్టి, మనుష్యుని వలె పెరిగి మనుష్యుని వలెనే చావవలయును. దానికి బదులు మనుష్యుడుగా పుట్టి, మృగము వలె జీవించి రాక్షసునివలె చావరాదు.

**Really the proper study of Mankind is man** (మానవులకు నిజమైన అధ్యయన ఫలమే మనుష్యుడు). అని చెబుతారు. మన మనసులోని భావాలూ, మనం చే యు ప ను లూ, మనం చెప్పే మాటలూ-ఇవన్నీ ఒకే రీతిగా వుండాలి. మన మనో వాక్కాయములందు శుద్ధకర్మ ఆచరణ వుండాలి. ఇదే సార్థకమైన మార్గం.

భక్తి భక్తి యంటూ వూరకే జపమాలను తిప్పడం. సరియైన విధానం కాదు. కేవలం ధ్యానం చేసుకుంటూ కూర్చునేది కూడా సరియైనది కాదు. ఇదీ ఒక విధమైన స్వార్థమేనని చెప్పవచ్చును. "అష్టాదశపురాణేషు వ్యాసస్య వచనద్వయం - పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం" పద్దునెనిమ్మిది పురాణముల యందు వ్యాసమహర్షి రెండు ప్రధాన విషయాలు చెప్పినాడు. ఇతరులకు ఉపకారం చేయుట అనునది మొదటిది. సాధ్యమైనంత వరకు ప్రజాహిత కార్యములను ఆచరించుట. ఒక వేళ ఇతరులకు ఉపకారం చేయుట నీకు సాధ్యం కాక పోతే అపకారమైనా చేయకు. అప్పుడదే పెద్ద ఉపకారమవుతుంది. "పాపాయ పరపీడనం" ఇతరులను హింసించడం, బాధకలిగించడం నిజంగా మంచిదికాదు.

ఈ పాపపుణ్యాలు మరేదో లోకము నుండి పుట్టిన వస్తువులు కాదు. నమోక్షో అస్తి పాతాళే, నభూతలే అజ్ఞాన హృదయ గ్రంధినాశః ఇతిమోక్షం- పాప పుణ్య మోక్షాలు వేరే లోకాలనుండి వచ్చినది కాదు అని, శ్రుతులు, పురాణాలు చెబుతాయి. ఈ పాపపుణ్యాలు మొదలగు వానిని ఏ కంపెనీయు మనకు తయారుచేసి యివ్వలేదు. మన స్నేహితులూ దీనిని తయారుచేయలేదు. మనపనుల వలననే మనము పాపపుణ్యములను పొంతుతున్నాము. ఈ ప్రపంచంలో ప్రతిదానికి **Reaction, Resound and Reflection** (ప్రతిక్రియ, ప్రతిధ్వని, ప్రతిబింబం) వుండనే వుంటుంది. అందువలన ఈ విషయాలను మనము మనసునందుంచుకొని పవిత్ర కార్యములనే చేయవలయును. అక్రియ, అనాచార, అన్యాయాలకు మనం దూరంగా వుండాలి. 'ఏదో విధంగా డబ్బు సంపాదించాలి"అనునది సరియైన దీక్ష(వ్రతం) కాదు. త్యాగమే నిజమైన దీక్ష.

ఒక చిన్న ఉదాహరణ. మనము వూపిరి పీల్చునపుడు గాలిని లోనికి తీసుకొంటాం. లోపలికి పీల్చిన గాలిని తిరిగి బయటికి విడువక పోతే మన శ్వాసకోశాలు చెడిపోతాయి. నోటినుండి తిన్న ఆహారాన్ని మరొక ద్వారం గుండా బయటికి విడువక పోతే కడుపుచెడిపోతుంది. ఒక భాగమునందలి రక్తము అక్కడ నుండి ఇంక చోటకు ప్రవహింప కుండా నిలిచి పోతే అక్కడ ఒకపుండు ఏర్పడుతుంది. కేవలం ధనకనక వస్తువాహనాదులే కాదు. మన మానసిక భావములు కూడ నిరంతరం మారుతుండాలి. మనలో మొదట స్థిరపడిన భావాలను అట్లే వుంచుకొనిన ప్రయోజనం లేదు. పరమాత్మకు సంబంధించిన

పవిత్ర భావములకు మనసులో ప్రవేశపెట్ట వలయుని మొత్తానికి మనస్సు సరిగా వుండాలి. అందుకోసమే గాంధీ మహాత్ముడు "పరమాత్మా! సర్వులకు మంచి మనసు ఇవ్వు" అని భగవంతుని ప్రార్థించినారు. "సబ్‌కో సన్మతిదే భగవాన్" అని వారు చెప్పారు. ఈ విధంగా అందరికి మంచిబుద్ధి కలిగితేనే మనుష్యుడు నిజమైన మనుష్యుడవుతాడు. మంచిబుద్ధిలేని మనిషి పశువుతో సమానము.

భక్తి అనగా నేమి? భక్తునికి భగవంతుని పైగల ప్రేమే భక్తి. భర్తకు భార్యపైగల మను ప్రేమోహ ముని పిలుస్తారు. తల్లికి బిడ్డపైగల ప్రేమ వాత్సల్యం బంధువులపైగల ప్రేమను అనురాగమంటాం. వస్తువులపైగల ప్రేమ కోరిక. అయితే పరమాత్మపైగల ప్రేమే భక్తి. కేవలం మంత్రాలుచ్చరించడం, పూజ చేయడం, దానికొసం విపరీతంగా డబ్బు ఖర్చుపెట్టటం మాత్రమే భక్తి కాదు. నీవు పేదలకు సహాయ పడి నపుడు మాత్రమే నీకు భగవంతుని అనుగ్రహము లభిస్తుంది. పరమాత్ముని ప్రేమ పొందవలయునంటే మనము ముందుగా ప్రజాభిమానాన్ని పొందాలి. మానవ సోదరత్వమును, దైవపితృత్వాన్ని పొందాలంటే మనము ప్రేమ తత్వమును అభ్యసించాలి. ఈ ప్రేమవలన మనము పరమాత్మను పొందవచ్చును.

ఆకాశమునందు చంద్రుడు వుదతాడు. అతనిని దర్శించడానికి టార్చిలైటు, విద్యుత్ కాంతి, గ్యాస్ లైట్ మొదలగునవి అవసరం లేదు. చంద్రుని కాంతి వల్లనే మనము చంద్రుని చూడగలుగుతున్నాం. అదే విధంగా ప్రేమ స్వరూపుడైన భగవంతుని చూడాలంటే ప్రేమ యనెడి కాంతి అవసరం పరమాత్ముని దర్శించుటకు ప్రేమ మార్గం కంటే వేరే మార్గం లేదు.

ఇదొక హారం. ఇందులో రెండు వస్తువులున్నాయి. ఒకటి దారం. రెండు పూలు. పూలు ఎక్కువగా ఉన్నాయి. అయితే దారం ఒక్కటే. ఈ పూలు నిన్న మొగ్గలుగా వున్నాయి. నేడు వికసించాయి. రేపు రాలిపోతాయి. అయితే ఈ దారం ఇప్పుడూ ఉంది. రేపు ఇలాగే ఉంటుంది. పూవులతో కూడి యున్న ఈ దారమే బ్రహ్మసూత్రము. అందులో నున్న పూవులే ఈ జీవరాసులు. ఇట్లే ఈ ప్రపంచము నందు సర్వజీవరాసులలోను పరమాత్మ యనుదారము కూడా ఉంది. దీనినే బ్రహ్మసూత్రం అని పిలువవచ్చును. ప్రతి జీవి హృదయమునందు పరమాత్మ యనే దివ్యశక్తి లేక పరంజ్యోతి ఉండనే ఉంది.

ఇదొక లోటా. ఇందులో నీరుంది. దీనిలో కొంచెం చక్కెర వేస్తే ఆ చక్కెర అడుగున చేరుకొంటుంది. అప్పుడు పైనున్న నీరు త్రాగితే ఏమి రుచి ఉండదు. ఒక చెంచాతో నీటిని కలియదిప్పిన ఆ నీరు తియ్యనగును. మన హృదయమను పాత్రలో పరమాత్మ దివ్యత్వమను చక్కెర ఉంది. దీనికి తోడు ప్రాపంచిక విషయవాసనలు అనెడు నీరు కూడ హృదయంనిండా ఉంది ఆ నీటికి ఏ రుచీ లేదు. అదే విధంగా ఈ విషయవాసనలను నిత్యమూ అనుభవిస్తున్నా మనకు అందులో ఏ ఆస్వాదన చిక్కదు ప్రతిరోజు తిండి తింటున్నాము. ప్రతిరోజు ముఖము కడుక్కొంటున్నాము. ఇట్లు యాంత్రికంగా మనము 70, 80 ఏండ్లు గడుపుతాము. దీనికి కారణమేమి? మనకు జీవితము నందు నిజమైన రుచిని ఆస్వాదించుట తెలియదు. బుద్ధి యను చెంచాను ఉపయోగించి సాధనద్వారా మన హృదయమునందున్న దివ్యత్వమున ఎల్లెడలా వ్యాపించునట్లు చేయాలి. అప్పుడు ఈ దివ్య ఆస్వాదన అన్ని వైపులకు వ్యాపిస్తుంది.

మనము అన్ని పనులు భగవంతుని తృప్తికొరక చేయాలి. ఆపిల్ పండు తినాలని మన కనిపిస్తుందనకొండి. ఆపిల్ పండు తృప్తికోసం మనం ఆ పండును తినలేదు. మన తృప్తి కోసం తింటున్నాం. "ఈరోజు

సాయిబాబా వస్తారు. మనం ఆ సభకు పోవాలి" అనుకొని మీరు ప్యాంటు బదులు ధోవతి కట్టుకొని ఈ సభకు వచ్చితిరి. ధోవతి తృప్తికోసం మీరు దానిని కట్టుకోలేదు. మీ తృప్తికోసం కట్టుకున్నారు. నీవు అన్నాన్ని తినేది అన్నం తృప్తికోసం కాదు. నీ తృప్తి కోసం. ఒక వ్యక్తి తన తృప్తి కోసం పెళ్ళి చేసుకొంటాడు. కాని పెళ్ళి తృప్తి కోసం కాదు. ఉదయం నుండి సాయంకాలము వరకు నీవు చేయు పనులెల్లా నీ తృప్తి కోసమే కాని ఇతరుల తృప్తి కోసం కాదు. ఈ "నీవు" అనునది ఎవరు? "ఇది నా చేయి. ఇది నా తల" అని మనం చెబుతాం. "నా ఈ బుద్ధి, నా మనస్సు, నా కడుపు అని పిలుస్తాం. "ఇది నా దేహం" అని చెప్పునప్పుడు నీవు దేహం కంటె అతీతమైన వేరే వస్తువు అయితివి. అదే పరమాత్మ. మీరంతా పరమాత్మ స్వరూపులు. అందువలన 'ఈశావాస్యం ఇదం సర్వం'. అందరియందు అంతర్యామి రూపమైన పరమాత్మ యున్నాడు అని ఉపనిషత్తులు చెబుతాయి. 'ఈశ్వరః సర్వభూతానాం' అని గీత

**You are not one Person. The one you think you are.** నిజంగా నీవు ఒకే వ్యక్తి కాదు. ప్రప్రథమంగా నీవెవరు నీవు భావిస్తావో ఆ వ్యక్తిని. **The one others think you are.** ఇతరులు నీవు ఎవరివని భావిస్తారో అదే నీవు **The one really you are.** నిజంగా నీవు ఏమైనావో అదే నీవు.

ఆత్మతత్త్వం పైన దేహతత్త్వం, మనస్తత్వమూ అను రెండు కవచాలను మనం ధరించినాము. వీటి రెండింటిని ఛేధించినచో నిజస్వరూపము బయటపడుతుంది. అందువలన మనమెవరిని ద్వేషించరాదు. ఎవరిని నొప్పించరాదు. ఎవరిని పరిహాసమాడరాదు. ఎవరిని దూషించరాదు. నేడు మనం ఏం చేస్తామో రేపు దాని పరిణామం అనుభవిస్తాం. యద్భావం తద్భవతి– నీవు ఏమనుకుంటావో, ఏమి చెబుతావో దానిని నేడు కాకపోయినా పది సంవత్సరాల తరువాత అయిన నీవు అనుభవించియే తీరాలి. అందువలన నువ్వు పవిత్రంగా ఉండాలంటే ఎవరినీ దూషించరాదు. నీ కర్తవ్యాన్ని నీవు నెరవేర్చు. ఇతరులను గురించి "వీళ్ళు ఇట్లా వాళ్ళు, వాళ్ళు అట్లా వాళ్ళు" అని ఎక్కడా చెప్పకు. ఒక ఉపనిషత్తునందు ఇట్లు చెప్పినారు. "సర్వ జీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి– నీవు ఎవరికి నమస్కారం చేసిననూ అది పరమాత్మనికి చేరుతుంది" అదే రీతి, సర్వజీవం తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి – ఎవరిని నీవు తిరస్కరించినా నీవు పరమాత్మని తిరస్కరించి నట్లవుతుంది. అందువలన నీవు ఎవరినైనా నిందిస్తే అది పరమాత్మని నిందించినట్లవుతుంది. దీనిని మనసు నందుంచుకొని నీవు మంచి మార్గమున నడచుకోవాలని నేను ఆశిస్తాను.

నేడు ప్రపంచంలో ఎక్కడ చూసినా శాంతి. శాంతి, శాంతి అను మాట వినిపించుచున్నది. ప్రధాన మంత్రి నుండి భిక్షుకుని వరకు శాంతి కావాలని చెబుతారు. ఈ శాంతి మార్కెట్‌లో దొరుకుతుందా? మన క్రియ, కర్తవ్య, కర్తల నుండే మనం శాంతిని పడయవలయును, చెడ్డపనులు చేస్తూ, చెడు దారిన నడచుకొంటూ "మాకు శాంతి కావాలి" అని బొబ్బలిడినచో శాంతి ఎట్లు లభించును? ఉప్పునీరు తీసుకొని 'మాకు మంచినీరు కావాలి' అని చెప్పిన అది ఎలా లభిస్తుంది? శాంతి మార్గమున నడిస్తేనే మనుష్యునకు శాంతి చిక్కుతుంది. కాని వేరే మార్గమున అతనికి శాంతి లభించదు.

ఇక్కడ ఈ పవిత్ర స్థలమునందు బిడ్డల అభివృద్ధిని కోరి, వారిని భావి భారత పౌరులుగా చేయు కార్యము నిజంగా ఉదాత్త కార్యం. ఈ మార్గంవలన మాత్రమే మనదేశానికి సుఖశాంతులు లభిస్తాయి తప్ప వేరే మార్గం వలన లభించవు. రాజకీయాలు మనల్ని

రక్షించలేవు. యంత్ర, తంత్ర మంత్రాలు మనల్ని కాపాడలేవు. భారతీయ సంస్కృతి, పవిత్ర ఆదర్శాలను మనసునందుంచుకొని ఉదాత్త మార్గమున నడచు కొనుచూ ఈ ఆదర్శాలను జీవితమునందు అనుష్టించి నపుడు మాత్రం మనకు శాంతి చిక్కుతుంది. అతి శీఘ్రకాలంలోనే పవిత్రమైన మన భారతదేశం కళ్యాణ మార్గమున నడచి ఆధ్యాత్మిక ఆనందాన్ని నింపుకొని "కలకల" నగవును పొందునట్టి స్థితిని పొంది తీరుతుంది.

నిజంగా నా కన్నడం మీకు అర్థం చేసుకోవడం కష్టమయ్యుండవచ్చు. ప్రతిదానికి అభ్యాస ముండాలి.

శ్రేయోహి జ్ఞానమభ్యాసం జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే
ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాత్శాంతిః
అనంతరామ్॥

ఎంత వారికైనా అభ్యాసముండాలి. సంభాషణలో కొంచము కన్నడ పదాలను ఉపయోగించి మాట్లాడే అభ్యాసం నాకుంది కాని ఇంతటి సభలలో మాట్లాడే అభ్యాసం లేదు. అయితే నిజమైన భాష ఏది ? హృదయ భాషయే నిజమైన భాష. ఈ నీరును తెలుగులో నీళ్లు, తమిళంలో తన్ని, సంస్కృతంలో వారి, హిందీలో పానీ అని పిలుస్తారు. అయినా ఈ నీరు ఒకే పదార్థము. అదే విధంగా వ్యవహారమున నుండు భాషలు వేరు వేరైనను హృదయ భాష ఒకటే అయి వుంటుంది. అదే నిజమైన భాష. తక్కిన భాషలు కేవలం సంభాషణ కొరకు మాత్రమున్నాయి. అంతే గాని "పద్మభూషణ" మొదలగు బిరుదులు పొందుటకు ఈ భాషలు ఏర్పడలేదు. ఒకని అభిప్రాయాన్ని మరొకరు తెలుసుకొనుటకు భాషలు ఏర్పడినాయి. ఈ హృదయ భాషయే మనుష్యుని భాష. మీరది తెలుసుకొని నామాటలలో ఏమైన తప్పులు దొరలిన సరిదిద్దు కొనగలరని ఆశిస్తున్నాను.

ఈ ప్రపంచంలో నా రా య ణ సే వ చేయునది ముఖ్యమైనది. నేడు ఎక్కడ చూసినా ప్రజలు తిండికి కటకట పడుచున్నారు. నిజంగా మనము కష్టపడి పనిచేసిన ఈ సమస్య వుండదు. ఎందుకంటే మనకు ఒకే ఒక పొట్టవుంది. కాని పని చేయడానికి భగవంతుడు మనకు రెండు చేతులిచ్చినాడు అందువలన రెండు చేతులతో కష్టపడి పనిచేసిన ఒక పొట్టను నింపుకొనుట మనకు సాధ్యం కాదా? కష్టపడి పని చేయడం మనకు ఇష్టంలేదు. కాని పొట్టనింపుకోవాలనే ఆశ మాత్రం వుంది. ఇదే సోమరితనం. త్యాగభూమి, యోగిభూమి కర్మభూమియైన ఈ భారతదేశమున పుట్టిన మనము కష్టపడి పని చేయడానికి సిద్ధంగా వుండాలి! "కష్టేఫలి" మనమెంత కష్టపడతామో అంతే ఫలితాన్ని పొందుతాము.

పవిత్రమైన ప్రేమ తత్వాన్ని పెంచుకొని, పరస్పరం మంచి సంబంధాలను పెంచుకొని జీవితాన్ని సార్థకం చేసుకోవాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ ఈ ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను.



# భక్తవత్సలుడు భగవానుడు

కరిరాజు గావగ, గదలి రాలేదె, హరి వైకుంఠంబు వీడి
ప్రహ్లాదు బ్రోవగ, నరహరి రూపంబెత్తలేదె, అసుర సంధ్య
అంబరీషునాదుకొన, సుదర్శన చక్రంబు, నంపలేదె చక్రి
ఎన్నడేని, భక్తవత్సలుడు, భగవాను డెంచిచూడ!

ధరను చాపచుట్టు, దనుజబుద్ధిన్
వరాహరూపం బెత్తి, వమ్ముచేసినావు
దైవంబు నేనను, నహంకారమున్
నరసింహ రూపంబెత్తి, నాశంబు చేసినావు

మానవ జన్మంబెత్తి, మానవధర్మంబు,
అవని చాటి నావు, రామావతారంబునన్,
గీతనుద్బోధించి, విశ్వరూపంబు చూపి,
నరుని, కార్యోన్ముఖు చేసినావు, కృష్ణ రూపంబునన్

ఇట్లు, ధర్మపరి రక్షణకై యుగయుగాన,
అవతారంబెత్తి, అసుర బుద్ధుల హరించి
బుధజనుల గాచి, కలియుగాన. నీవు
కర్మసిద్ధాంత ముద్ధరింప, సాయివైనావా?

దుష్టబుద్ధుల మననుండి, దూరతీరాలకు దరుమ
చిత్రవిచిత్రంబుగ, చిత్రావతీ నదీతీరాన,
పుట్టపర్తి గ్రామాన, ప్రశాంతి నిలయాన, నేడు
ఉదయించె సాయి, మన హృదయాల ప్రేమనింప.

ఒక్కొక్క రక్కసు, దునుమాడి,
ఒక్కొక్క రూపునెత్తి, హరిభక్తులగాపగ,
కలియుగాన, మనంబులె. రక్కసులవుట,
ప్రేమమూర్తియై, వెలసె సాయి, వెతలబాప !

మానవసేవ చేయు, నిండుమనంబునన్
పట్టిన పట్టు వీడకు, ఫలితంబు వచ్చు దనుక
కోరినకోర్కె వీడకు, అది తీరుదనుక,
అను సత్యంబు నుద్బోధించు సాయి మనకు.

మనుషు లందరు ఒక్కటి, మతలములన్ని ఒక్కటి,
దేశ సరిహద్దు లెల్ల కల్ల, ద్రోహబుద్ధి వలదు,
మంచిని పెంచి చెడునుపీడు, నేను నీవాడ
నీవు నావాడవను, కర్మ సిద్ధాంతంబు చెప్పసాయి!

పరుని కష్టంబు. తన కష్టంబుగ,
భావించుటె, పరమ ధర్మంబు
తన దోషంబు గుర్తించి, పరదోషంబు
లరయ కుండుటె, మానవత్వంబు,

తరతమ భేదంబు త్యజించి, సత్యంబు
పాటించుటె, పరమ పవిత్రంబు,
మనో మాలిన్యంబుల, పారద్రోలి,
నిష్కామ కర్మచేయుటె, నిజభక్తి.

అట్టి భక్తుల నాదుకొన, భగవంతుండు,
సర్వసిద్ధుండు, సర్వ శక్తి మంతుండు,
కుశంకల వీడి, మనోవాక్కాయ కర్మలన్,
మానవ సేవ జేసి, మాధవు చేరుకొమ్ము!

శరీరంబునకే, చావుపుట్టుకల్,
ఆత్మకు అంటవు, ఎట్టి సుఖదుఃఖముల్,
అది నిత్యము, సత్యము, నాశములేనిది,
మానవ అవతరణే, దైవత్వంబు కన్నచిన్న.

అమ్మయే, ప్రథమ గురువు శిశువునకున్,
తల్లి చెప్పకున్న, తండ్రిని గుర్తించగలేడే బిడ్డ,
ప్రకృతిమాత మాట, పెడచెవినిబెట్టి,
ఏరేతి గుర్తించు, మానవుండు, జగత్పితన్.

ఆత్మశుద్ధి లేని, పూజ లర్థరహితంబులు,
అహంబు వీడనంత వరకు, పరంబులేదు,
ధర్మార్థకామమోక్ష పురుషార్థములబడయ
సన్యసింప బనిలేదు, సన్నుతించు సదా సాయినీవు.

బిడ్డనాదుకొన, కన్న తల్లి వంగిన చందాన,
దైవంబు లొంగు, భక్తుల నాదరింప,
భక్తి ప్రేమలే పాశంబు భగవంతునకు,
అద్దాని నంకుశంబుగ, నెంచకు నెన్నడైన.

తల్లిదండ్రి, తోడునీడ, సర్వంబు, నేనై ఉండ
అన్నిచూచు చక్షువు లేల గాంచవు నన్ను,
చిత్త శుద్ధితోడ, ఇంద్రియ నిగ్రహంబుతోడ,
చిదానంద రూపు, సాయి ధ్యానించి, పొందు

బ్రహ్మవిష్ణు మహేశ్వర రూపంబు నీ వంచు,
ప్రత్యక్ష పరమాత్మ రూపంబు నీవంచు,
కీర్తనలు రచించి, భక్తి మీర గానంబు చేతుమయ్యా,
మమ్ము దీవించి, దరి చేర్చిబ్రోవ వయ్యా సాయి ఈశ!



# సాయిబాబా - దూరదర్శిని - భవిష్యత్తు

1978 సం॥ డిసెంబర్ నెలాఖరున నా భార్య, టాటా, స్నేహితుడు ప్రొఫెసర్ ప్రిబెన్‌బ్లమ్, నేను - డెన్మార్క్ నుంచి వచ్చిన మేము ముగ్గురం ప్రశాంతి నిలయం చేరుకున్నాం. అక్కడ ప్రొఫెసర్ శామ్యూల్ శాండ్‌వీస్ మమ్మల్ని ఎదురొచ్చి కలుసుకున్నాడు.

అది నిజంగా ప్రశాంతి నిలయమే. మేమెన్నటికీ మరువలేని ఒక వారం రోజులు అక్కడ గడిపేము.

మేము వెళ్ళిననాటి ఉదయమే స్వామి మమ్మల్ని ప్రత్యేక దర్శనం కొరకు పిలిచేరు. అంతకంటే ఏమి కావాలి!

నేనూ నా భార్య కృషి చేస్తున్న అంతర్జాతీయ టెలివిజన్ సంస్థని స్వామి ఆశీర్వదించేరు. దానితో ఈ మా సంస్థ దిగ్విజయం పొందటానికి ప్రపంచ మంతటా ఉత్సాహ సహకారాలు అందిస్తున్నట్లు దృశ్యాలు కళ్ళముందు కనబడ్డాయి.

మానవుని మనుగడకు సంబంధించినది మా ఉద్యమం. మన పిల్లలకు మనుమలకు అనుకూలమైన పరిస్థితులను ప్రపంచంలో నెలకొల్పడమే మా ఆశయం. స్వామి యొక్క అవతార మహోద్యమం కూడా మానవాళిని నైతిక మార్గమున ప్రవేశపెట్ట డమే కనుక మా దూరదర్శిని ఉద్యమానికి స్వామికి దగ్గర సంబంధం ఉందని సనాతన సారథి పాఠకులకు విన్నవిస్తున్నాను.

టెలివిజనులను నడపుచున్న అనేక ప్రయివేటు, జాతీయ సంస్థలను దగ్గరకి చేర్చి పరస్పర సహకా రంతో ఈ ఉద్యమం కొనసాగించటమే మా ఆశయం. ఉదాహరణకు పన్నెండు సంస్థలు ఈ ఉద్యమంలో చేరి ఒక్కొక్క సంస్థ ఒక్కొక్క అంతర్జాతీయ సమస్యపై ఒక్కొక్క కార్యక్రమం ఒక సంవత్స రంలో తీసిందనుకుందాము. సంవత్సరానికి పన్నెండు కార్యక్రమాలవుతాయి. ప్రతీ సంస్థ వాళ్ళు తీసిన కార్యక్రమంతో పాటు మిగిలిన పదకొండు కార్య క్రమాలు కూడా ప్రదర్శించగలుగుతారు. అంటే ఒక్కొక్క సంస్థ సంవత్సరానికి పన్నెండు, అంటే నెలకొక కార్యక్రమాన్ని ప్రదర్శిస్తుంది.

ఆయా దూరదర్శిని కార్యక్రమముల తయారీలో సాంకేతిక పర్యవేక్షణ చేస్తూ అందరితోనూ సహక రిస్తాము. మేము దూరదర్శినిద్వారా తీసి ప్రదర్శించ దల్చుకున్న కొన్ని అంశముల జాబితా ఇదివరకే తయారుచేశాము.

ఆహారకొరత - జనాభా
యుద్ధమువల్ల ప్రమాదం
మానవత లేని విజ్ఞానం
అతిగా సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధి-ప్రమాదం.
సహజవనరుల విధ్వంసం.
గాలి, నీరు, నేలల కాలుష్యం.
మానవాళిలో నైతికపతనం.
జీవ్యాపరణ సమస్యలు
సంసారజీవన వ్యవస్థ విచ్ఛిన్నం.
త్రాగుడు, మత్తు మందులు, నయ - దౌర్జన్యం.

యంత్రారాధన, ధనాశ, అశాంతి.
వ్యక్తికి సుఖశాంతులు ఎండమావులా?
మానవుడూ ఒక యంత్రమేనా?
పుట్టుటకు ముందు గిట్టుటకు తర్వాత ఏముంది?
మతము విజ్ఞానముల సంబంధము.
సాయిబాబా – వారి మహిమలు –
వారి విద్యా విధానం – దివ్య సందేశము.

ఇది కేవలం సూచనప్రాయం. భవిష్యత్తులో మానవుని జీవనసమస్యలు ఎన్నెన్నో టెలివిజన్ కార్యక్రమాలకు అద్భుత కథావస్తువులు కాగలవు ఇదంతా మీకొక నవ్వులాటగా అనిపించినా భవిష్యత్తులోని మానవుని మనుగడను గురించి ఊహాగానం ఎంతయినా వినోదదాయకం.

ఈ ఉద్యమం ఆరంభించిన మేము ప్రవక్తలము కాము. భవిష్యత్తు ఎదుర్కొనే ప్రశ్నలకు, సమాధానాలు కూడా మాకు తెలియవు. కాని ఒక విషయం మేము ఖచ్చితంగా చెప్పగలం. ఈనాడు దూరదర్శినిలు ప్రదర్శించే కల్పితగాథలు కంటే దౌర్జన్యం దుర్మార్గం ప్రేరేపించే అంశాలు కంటే ఫుట్‌బాల్ ఆటకంటే మేము ప్రదర్శించదల్చుకున్న కార్యక్రమాలు నైతిక ప్రయోజనం ఉన్నవి. నేటి ప్రపంచంలో దూరదర్శిని కార్యక్రమాలు మనస్సులపై ఎంతయినా ప్రభావం కలుగజేస్తాయి. అందుచేత ముఖ్యమైన అంశములపై చర్చలద్వారా మానవాళియందు కనువిప్పు కలిగించి నైతిక పరివర్తన వైపు మనస్సులను మళ్ళించే అవకాశం ఉంది.

డా॥ యస్. పి. రహేలా, డా॥ డానెరాబిన్‌సన్ రచించిన గ్రంథం 'సాయిబాబా – వారి సందేశం' మొదలయిన గ్రంథాలు టి. వి. కార్యక్రమాలకు ఎంతో ఆదర్శమైనవి. అందులోని 'విశ్వమానవ సమాజ నిర్మాణం' 'సాయి సమాజ నిర్మాణం' 'సాయి ఉన్నత విద్యావిధాన ఉద్యమం' మొదలయిన అధ్యాయములు దూరదర్శిని ప్రసారానికెంతో అద్భుతంగా ఉపకరిస్తాయి.

ప్రిన్సిపాల్ శ్రీ నరేంద్ర సౌజన్య సహాయముతో, వైట్‌ఫీల్డ్‌లో ఉన్న శ్రీ సత్యసాయి కళాశాలను సందర్శించినపుడు అక్కడ మానవోద్ధరణకు జరుగుచున్న అమూల్య కృషి మమ్ము ముగ్ధులను చేసింది. ఇక్కడ భజన చేస్తున్న విద్యార్థులను చూసినప్పుడు ఇందులో ఎంతోమంది మరో శతాబ్దంలో, ఆత్మహత్యా సదృశమైన నైతిక పతనానికి గురైన మానవాళి నుద్ధరించే మహానాయకులు కాగలరనే ఆశాభావం కలుగుతుంది.

ఫిల్ములు తియ్యడం వృత్తిగా గల నేనూ నా భార్యా టాటా ప్రశాంతినిలయం, వైట్‌ఫీల్డులలో కొన్ని దృశ్యాలను ఫిల్ముగా తీశాము. స్వామి దర్శనమిచ్చే సన్నివేశాలు, స్వామి సాయిగీత చేత మాల వేయించుకున్న దృశ్యం, స్వామి అద్భుత చర్యలను గూర్చి ప్రత్యేక ప్రసంగము లిచ్చిన డా॥ భగవంతం, డా॥ శాంక్‌వీస్, శ్రీ హొవార్డ్ మర్ఫెట్ మొదలయిన వారితో ఇంటర్వ్యూలను చిత్రీకరించేము. ఇంతవరకూ తీసిన చిత్రము స్వామిపైన ఒక డాక్యుమెంటరీ చిత్రము రూపొందించుటకు సరిపోవునని ఆశిస్తున్నాము. తీవ్రమైన భౌతికవాదం ప్రబలిన నేటి ప్రపంచంలో ఆధ్యాత్మిక విషయముల పట్ల అభిరుచి కలిగించడం సులభం కాదు; అయితే స్వామి ఆశీస్సులున్నాయి కనుక మా ఉద్యమం ప్రజాదరణ పొందుతుందనీ తద్వారా సాయిబాబా, వారి సందేశమును వ్యాప్తి చేసే అదృష్టం కలుగుతుందని విశ్వసిస్తున్నాము

మా అంతర్జాతీయ దూరదర్శిని ఉద్యమం కార్యరూపం దాల్చినప్పుడు మేము ప్రశాంతినిలయం వైట్‌ఫీల్డులలో తీసిన ఫిల్ము మా కార్యక్రమాలలో సముచిత స్థానం ఆక్రమిస్తుంది.

స్వల్ప ధనవ్యయంతో ఈ ఉద్యమాన్ని నిర్వహించాలని మా ఆశయం. అంతేకాని దీనితో పెద్ద వ్యాపారం కొనసాగించాలని కాదు. ఈనాడు అడుగంటుచున్న ప్రేమ, వివేకములు పునరుద్ధరింపబడాలనీ ఈ ఉద్యమం వాటికొక వాహిక కావాలనీ ఆశిస్తున్నాము. ఐక్యరాజ్యసమితి, ప్రపంచ ఆరోగ్య సంస్థ, అంతర్జాతీయ సాంఘిక, సాంస్కృతిక సంక్షేమ సంస్థలవంటి ప్రపంచ సంస్థలు, ప్రముఖ వ్యక్తులు, వాణిజ్య సంస్థలు మత ప్రాతిపదిక మీద నెలకొల్పబడ్డ సేవాసంస్థలు అందించే సహకారము కూడా బహుళ ప్రజాదరణ మీద మా ఉద్యమ నిర్వహణ ఆధారపడి ఉంటుంది.

అన్నిటికంటె ముఖ్యముగా సాయిబాబా ఆశీస్సులు మాకు అండదండలు.

హెగెన హెస్సెల్ బాల్ఫ్,
స్కాండ్స్‌బర్గ్, డెన్మార్క్.

# భయమెందుకు ?

"నేనుండగా భయమెందుకు?" స్వామి చెప్పే వజ్రంలాంటి వాక్యం యిది. తరచు దీన్ని మనం స్మరిస్తూ ఉంటాం. బాబా వారి చిత్రాల క్రింద ఈ అభయవాక్యం ఉంటుంది. వారి షిరిడీ రూపంలో కూడా 'నీవు నన్ను చూస్తే నేను నిన్ను చూస్తాను' అంటూ ఉండేవారు. యిది వారి షిరిడీ రూపంలో చెప్పిన వజ్రం వంటి వాక్యం. భజన మందిరాల్లో ఈ రెండు వాక్యాలనూ అట్టలమీద వ్రాసి వీటిని ప్రదర్శించుతాం. ఈ రెండు వాక్యాలనూ పదే పదే మనం మననం చేయాలి. అప్పుడే మనం మానవతనుంచి మాధవతకు పరిణామం చెందుతాం. మనలో ఈ పరిణామం కలిగించటానికే తాము మానవాకారంలో వచ్చినట్లు స్వామి అంటూ ఉంటారు.

భజన మందిరంలో కూర్చొని ఉండగా "నేనుండగా భయమెందుకు?" అని వ్రాసిన అట్టమీద నా దృష్టి పడింది. ఇందులో 'ఎందుకు?' అనే ప్రశ్నార్థక పదం ఉంది. 'భయపడవద్దు' అని చెప్పకుండా, 'భయమెందుకు' అని ప్రశ్నిస్తున్నారు స్వామి. అయితే వ్యక్తిగతంగా బాబా ఇంటర్వ్యూ ఇచ్చినప్పుడు 'నీవు ఒక టిక్కెట్టు కొనుక్కొని ప్రయాణం ప్రారంభించు. నేను టిక్కెట్టు లేని ప్రయాణీకుడుగా నీతో ప్రయాణం చేస్తూనే ఉంటాను". ఇలా భక్తులమీద గల కరుణతో స్వామి చెబుతారు కానీ "నేను ఉండగా భయమెందుకు?" అని మనల్ని ప్రశ్నిస్తూ ఉంటారు.

"భయమెందుకు?" అనేది ఎడతెగని ప్రశ్న. ఎప్పుడు భయం మనల్ని ఆవహించినా మనకు మనం ఈ ప్రశ్నను వేసుకోవాలి. మన నిత్య జీవితంలో పందలసార్లు భయగ్రస్తులం అవుతూ ఉంటాం. బాధల్లో ఉండగా మనం బాబాను తప్పక తలుచుకుంటాం దోవ చూపించవలసినదిగా ప్రార్థించుతాం. "నేనుండగా భయమెందుకు?" అనే అభయవాక్యాన్ని గుర్తు చేసుకుంటాం. అప్పుడు మనలో ధైర్యం కలుగుతుంది. ధైర్యంగా ప్రవర్తిస్తాం. బాబా మనలను రక్షిస్తారని విశ్వాసంతో ప్రవర్తిస్తాం.

ఇటీవల ఒక సాయిభక్తుని జీవితంలో ఒక సంఘటన వినే అదృష్టం నాకు కలిగింది. ఆయన ఒక కాలేజీలో ప్రిన్సిపాల్. ఆ కాలేజీ విద్యార్థులు 'రౌడీయిజం'కు పేరు పొందినవారు. ఆ కాలేజీలో పని చేయటానికి లెక్చరర్లు ఎవ్వరూ ముందుకు రారు. అలాటి కాలేజీలో మన సాయీభక్తుడైన 'యాక్టింగ్ ప్రిన్సిపాల్' నిజంగా ప్రిన్సిపాల్‌గానే 'యాక్టు' చేస్తున్నాడు. లోకాతీతశక్తి పైన విశ్వాసం లేని ప్రిన్సిపాలులా సరిగ్గా 'యాక్టు' చేయలేకపోతూ ఉంటారు. అయితే మన మిత్రుడు ఎవ్వరికీ భయపడకుండా 'యాక్టు' చేస్తూ ఉంటారు. బాబావారే కాలేజీకి ప్రిన్సిపాలు అనీ, తాను మాత్రం బాబావారి ఉపకరణంగా 'యాక్టు' చేస్తున్నాననీ ఆయన చెబుతారు. ఈ రోజుల్లో దేశవ్యాప్తమైన విద్యార్థి అల్లరిని ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. విద్యార్థి నాయకుడు ఒక లెక్చరరు మీద చెయ్యి చేసుకున్నాడు. అదీ ప్రిన్సిపాల్‌గా ఉన్న తన ముందు. మన 'యాక్టింగ్ ప్రిన్సిపాల్' ఈ క్రమశిక్షణా రాహిత్యం చూసి సహించలేకపోయాడు. తన హృదయమందిరంలోగల బాబాను ప్రార్థించారు. "నేనుండగా భయమెందుకు. నీ కర్తవ్యం నీవు నిర్వహిస్తూ ముందుకుపో" అన్నారు బాబా. వెంటనే ఈ విద్యార్థి చేసిన నేరానికి శిక్షించాలని ధైర్యంగా ఒక నిర్ణయం తీసుకున్నాడు. "చూడు ! నీ ప్రవర్తన విద్యార్థి లోకానికే సిగ్గుచేటు. ఒక అధ్యాపకుణ్ణి నీవు కొట్టటం క్రమశిక్షణకు విరుద్ధంగా ఉంది, అందుకు నిన్ను సస్పెండ్ చేస్తున్నాను." అన్నారు ఆయన. బాబా వారిచ్చిన ధైర్యమే ఆయన ధైర్యం. లేకపోతే ఆ కాలేజీలో పని చేసే ఏ ప్రిన్సిపాలూ అంత చర్య తీసుకోకపోను. ఆ విద్యార్థి నాయకుడూ విచిత్రంగా కంటినీరు పెట్టుకున్నాడు. క్షమార్పణ కోసం ప్రార్థించాడు. "నీవు పశ్చాత్తాపం చెందటంవల్ల నిన్ను క్షమించగలము. కానీ నా విద్యుక్త ధర్మం నేనూ నిర్వహించాలి. నీకు సస్పెన్షన్ ఆర్డరు ఇవ్వాలి. దానికి నీవు క్షమాప్రార్థన పత్రం సమర్పించాలి. ఒక రోజు నిన్ను సస్పెండ్ చేశాక నిన్ను మళ్ళీ కాలేజీలో చేర్చుకోవాలి" అన్నారు ప్రిన్సిపాల్. ఆయన అంత పనీ చేసి ఒకరోజు కాలేజీని మూసివేశారు. విద్యార్థులు అల్లరి చెయ్యలేదు. ఆయన్ని ఎవ్వరూ 'ఘెరావ్' చేయలేదు. మర్నాడు కాలేజీ తెరిచారు. అంతా ప్రశాంతంగా నడుస్తోంది. అప్పుడు కాలేజీ యజమాన్య సభ్యులకు, పెద్దలకు జరిగిన చర్యను గూర్చి ప్రిన్సిపాలు వివరించారు. ఆ రీతిగా ధర్మాన్ని నిర్భయంగా నిర్వహించిన ప్రిన్సిపాలు గుండె ధైర్యానికి వారంతా ఆశ్చర్యం చెందారు. తనకు గల ధైర్యం తన హృదయంలో గల దైవం ప్రసాదించారని ప్రిన్సిపాలు చెబితే వారంతా ఆ దైవశక్తి అపారమైనదని అంగీకరించారు !

"నేనుండగా నీకు భయమెందుకు?" అనే స్వామి వాక్యం ఒక దివ్యమంత్రం. దీన్ని గూర్చి మరొక గాథ మరో భక్తుని ద్వారా విన్నాను. ఇది ఒక అంధుని గాథ. బాల్యంలోనే అంధత్వం వచ్చినా తెలివి తేటలలో యం.ఏ. ప్యాసయ్యాడు. భగవద్గీత 700 శ్లోకాలూ ఆ చిరవ నుంచి ఈ చివరిదాకా కంఠస్థంగా వచ్చు. ఒక శ్లోకం మీద ఒక గంట ప్రసంగించ గలడు. ఆయన బాబా భక్తుడు. "స్టడీసర్కిలు" తరగతులు కూడా నిర్వహిస్తాడు. టీచరుగా ఆయన ఇంటర్వ్యూకు వెళ్ళవలసి వచ్చింది. "నీవు గుడ్డివాడివి విద్యార్థులనుఎలా అదుపులో పెట్టగలవు?" అని ఇంటర్వ్యూలో పెద్దలు ప్రశ్నించారు. ఇతరుల్లో లేని శక్తి నాకొకటి వుంది. నాకు విశ్వాసం ధైర్యం రెండూ వున్నాయి. నాకు భగవంతునిలో విశ్వాసం, విద్యార్థుల పట్ల ప్రేమ వున్నాయి. నా తరగతిలో విద్యార్థులు నా ముందు రౌడీపనులు చెయ్యరని నానమ్మకం అన్నాడు ఆయన. నేనుండగా నీకు భయమెందుకు?" అంటూ బాబా అతన్ని ప్రోత్సహించుతూ అలా చెప్పిం

చారు. అతనికి ఉపాధ్యాయ పదవి లభించింది. చాలా కాలం నుంచీ ఆ పాఠశాలలో ఆయన పనిచేస్తున్నాడు. అందరిలోనూ ఎంతో పేరు తెచ్చుకున్నాడు. ఆయనకు విద్యార్థుల వల్ల ఏ ఇబ్బందీ కలగటం లేదు. ఇదంతా పైన చెప్పిన మంత్ర ప్రభావమే అంటారు. ఆయన!

మూడవ కథ! ఒక ప్రిన్సిపాలు గారిది. ఆయనా స్వామి భక్తుడే. ఒక విద్యార్థి బి.ఏ. ప్యాసయ్యాడు. కానీ చాలా దుర్మార్గుడు. పోట్లాట, కొట్లాట అతడికి సహజ గుణాలు. యం.ఏ.లో చేరటం కోసంవచ్చాడు ఇంటర్వ్యూ జరుగుతోంది. ఇంటర్వ్యూ బోర్డు సభ్యులందరికీ అతడి సంగతి తెలుసు. కనుక అతనికి యం.ఏ.లో సీటు నిరాకరించారు. ప్రిన్సిపాలుగారు సాయి భక్తుడు. "ఎందుకుభయం ? నీ దినచర్యను ప్రేమతో నింపు, భయపడకు", అంటూ బాబావారు ప్రిన్సిపాలుకు ధైర్యం యిచ్చారు. ఆ పొగరుమోతు విద్యార్థిని తన ప్రక్కకు పిలిచారు ప్రిన్సిపాల్. "ఆ గోడమద మీ గురువుగారి ఫొటో వుందిచూడు, నీవు తెలివిగలవాడివి. కానీ పరిస్థితుల ప్రాబల్యంతో నీవు ఇలాటి దుష్ప్రవర్తనకు దిగజారిపోయావు. ఇప్పుడైనా నీ పొరపాటుకు పశ్చాత్తాపంచెంది, మీ గురువుగారిని క్షమించ వేడుకో. ఇకముందెప్పుడూ అలాటి పొగరుబోతు పనులు చెయ్యనని హామీయివ్వు ఆయన నిన్ను క్షమిస్తారు ; అని బుజ్జగిస్తూ ఆ విద్యార్థితో చెప్పారు. విచిత్రంగా అందరూ చూస్తుండగా ఆ విద్యార్థి ప్రిన్సిపాలుగారి కాళ్ళమీద పడ్డాడు. ప్రిన్సిపాల్ అభీష్టం ప్రకారం అతడికి యం. ఏ. లో సీటు దొరికింది. ఆ తర్వాత ఆ విద్యార్థి ఆ కళాశాలలో ఉత్తమ విద్యార్థిగా తయారయ్యాడని ప్రిన్సిపాలుగారు చెప్పారు.

"భయమెందుకు ?" ఇది అందరూ ఎదుర్కొనే ప్రశ్న. క్లిష్ట సమయంలో ఈ ప్రశ్నను మనకు మనం వేసుకోవాలి. అప్పుడు మనలో గల సాయి మనకు అభయంయిస్తారు. ఈ మాత్రం శ్రద్ధ విశ్వాసంవుంటే మనం ధైర్యంగా మాట్లాడుతూ, ధైర్యంగా మన విధిని మనం నిర్వహించగలం, ఫలితాలకు భయపడం ఎల్లప్పుడూ సాయి మనతోటే వున్నారనే నమ్మకం, అనుభవం మనచేత ఎన్నో విలువగల పనులు చేయిస్తాయి.

అందుచేతనే 'భయపడకు' అని అనకుండా "భయమెందుకు" అనే ప్రశ్నార్థకంలో బాబావారు బోధిస్తారు. మనకు గల వివేక దృష్టితో ఉదయం నుండి రాత్రి దాకా ఈ ప్రశ్నను వేసుకుంటూ ధైర్యంగా ప్రవర్తిస్తే, ఈ మన దేశం, ఈ మానవలోకం మనం చూస్తున్న పరిస్థితిలో వుండబోదు. ఒక సాధారణ మానవుడుగా ఎలాటి నైతిక శక్తి ప్రోత్సాహము లేకపోతే ఎవరికి వారు భయపడుతూ బ్రతకక తప్పదు. అయితే ఈ విశ్వాసం మనలో కలిగినప్పుడు మనం ఎవరికి భయపడాలి?

బాబావారు తమ పూర్వావతారంతో కూడా ఇదే చెప్పేవారు, "నీవు నన్నుచూడు.నేనూ నిన్ను చూస్తూవుంటాను." అని, మనం స్వామివైపు మన దృష్టిని మరల్చటం నేర్చుకోవాలి. అప్పుడే స్వామి కృప మనపై ప్రసరించేది. మానవ మాత్రుడు భగవంతుని భయపడుతూనే చూస్తాడు. అయితే మన పవిత్ర దేశంలో మన నాగరికత ప్రారంభించిన నాటి నుండి మన మహర్షులు, తపస్వులు "అభీః", "అభీః" "అభీః", భయపడకు, భయపడకు, భయపడకు,' అంటూ హెచ్చరిస్తున్నారు. మనం మనుజులం కామ మాధవులం అని మనం గుర్తించాలి. నిర్భయత్వం అనే పెన్నిధికి స్వామి మాధవుడు. ఇది బాబా వారిచ్చిన సాధన మంత్రం "నేనుండగా భయమెందుకు" అనే దానిని విశ్వసించి అలా ధైర్యంగా ఆచరించినపుడే సాధ్యం అవుతుంది.

—యం. వి. నారాయణ మూర్తి.

# చిరకాల మిత్రుడికి వీడ్కోలు

అలవాట్లు ఒకసారి పట్టుకుంటే వాటిని మనం విడిచి పెడదామన్నా అవి మనల్ని విడిచిపెట్టవు. ప్రపంచమంతటా మానవాళిని పీడించే అలవాట్లలో పొగ త్రాగడ మొకటి.

నన్నీ దురభ్యాసం పాతిక సంవత్సరాలుగా పట్టి పీడిస్తుంది. సరదాకి మొదలు పెట్టేదే శాశ్వతంగా పట్టుకుంది. మొదట్లో రోజుకు మూడు నాలుగు సిగరెట్లు కాల్చే అలవాటు యిరవై ముప్పయికి పెరిగింది.

1978 సం॥ సెప్టెంబర్ 21వ తేదీ గురువారం ఈనావ్యసనానికి అంతిమదినం. ఆనాడే నా ప్రియమైన స్వామిని దర్శించిన సుదినం. ఉదయం 11 గం॥ 20 ని॥ అయింది. అప్పుడే ఒక సిగరెట్ పేకట్ కొని సిగరెట్ కాల్చి, నా శ్రేయోభిలాషి, స్వామి భక్తుడు అయిన ఓ స్నేహితుడు దగ్గిరకి తిన్నగా వెళ్ళేను. అతని ముందు కూర్చొమన్నాడు. ఉదయం తను పూజచేస్తున్నప్పుడు నన్ను సిగరెట్లు కాల్చడం మానెయ్యమని స్వామి తనతో చెబుతున్నట్టు స్వామి రూపం గోచరమైందని చెప్పాడు.

ఇది నా ప్రియమైన స్వామి యొక్క ఆజ్ఞ భక్తుసిగా ఆ యాజ్ఞను శిరసావహించుట నా విధి. అదే స్వామి ఆజ్ఞ అయితే ఈ క్షణం నుంచి యిక సిగరెట్లు ముట్టను అన్నాను. ఆ మరునాడు నా పూజగదిలో వున్న స్వామి చిత్రపటం ముందు సాష్టాంగపడి నాలో వుండే ఆ బలహీనతను హతమార్చి నా ప్రతినకు విజయం చేకూర్చమని ప్రార్థించేను. ఆ తర్వాత కొద్ది రోజులలో నేను పడిన మానసిక చిత్రవధ ఎలాంటిదో సిగరెట్లు కాల్చేవాళ్ళకే తెలుస్తుంది. స్వామి అనుగ్రహం వల్ల వారం రోజులు ఆ మనోసంక్షోభాన్ని భరిస్తూ, మొత్తంమీద కాల్చుట మానేసేను. ఆ వారం రోజులూ ఈ చిరకాల మిత్రుడు లేక పోవడంతో జీవితం నూన్యంగా, రసవిహీనంగా కనబడింది. తీవ్రమైనవాంఛ, నిరాశ, కోపం, ఆందోళనలతోనా మనస్సు అల్లకల్లోలమైంది. వారం రోజుల అనంతరం మనోదౌర్బల్యం నా మనస్సును ఆక్రమించగా స్వామి ఆజ్ఞను ఉల్లంఘించే స్థితికి వచ్చేను. కాని మళ్ళీ మనస్సును స్వాధీన పరచుకున్నాను, అటుపైన మనోపీడనకు లొంగలేదు. ఆవేదనతో తీవ్రంగా స్వామిని ప్రార్థ ప్రార్థన, ప్రార్థన – నిర్విరామ ప్రార్థన. అదే నాకు శరణ్యమైంది.

విజయం సాధించేను. స్వామి అనుగ్రహానిదే యీ విజయం. ఈనాడు 1979 సం॥ మార్చి 21 వ తేది. నా స్నేహితుడికి వీడ్కోలిచ్చి సరిగ్గా ఆరు నెలలైంది. ప్రమాద పరిస్థితిని దాటేశాను ఇక మళ్ళీ సిగరెట్టు కాల్చే అవకాశం లేదు.

ఎంత హాయి ! ఈ వ్యసనం నుంచి బయిట పడటంతో ఎంతో డబ్బు మిగులుతోంది. ఆరోగ్యం ఎంతో బాగుంది. అన్నికంటే ఆనందం కలిగించేది నా భార్య ముఖంలో చెరగని చిరునవ్వు.

నేనూ కుటుంబ సభ్యులం స్వామికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పించు కున్నాము. భక్తులలో ఈ దురభ్యాసము యొక్క సంకెళ్ళలో చిక్కుకున్న సోదరుడెవరైనా ఈనా అనుభవాన్ని గురించి చదివి బంధ విముక్తుడైతే నేనెంతో ఆనందిస్తాను.

పొగ త్రాగే సోదరులకు నా విన్నప మేమిటంటే– అధైర్యపడకండి ; స్వామి ఎప్పుడూ మీ కూడానే వుంటారు. నా ప్రార్థనవిని నా నిరాశ బారినుండి కాపాడారు. మీరు విజయం సాధిస్తారు, సందేహం లేదు.

# విజ్ఞాన శాస్త్రము - దాని పరితత్వము

"ప్రకృతిని గూర్చి సక్రమంగా పరిశీలించి గ్రహించుట" విజ్ఞాన శాస్త్రముగా నిర్వచించబడింది. ప్రకృతి యొక్క నిజతత్వమును అన్వేషించుటయే విజ్ఞాన శాస్త్రము. ప్రకృతి యొక్క స్వభావమును, వైపరీత్యములను తరగతులుగా విభజించి అది "ఎందుకు? ఎలాగ?" పరిణమిస్తాయో పరిశీలించుటే నిర్దుష్టమైన విజ్ఞానశాస్త్ర మవలంబించే పద్ధతి. ప్రకృతిలో దుర్గ్రాహ్యమైన అంశములున్న సంగతి విజ్ఞాన శాస్త్రవేత్తలు కాదనలేరు. అటు వంటి అంశముల అస్తిత్వాన్ని గుర్తించి వాటిని ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించాలి. ఇటువంటి అద్భుతములను గురించి విజ్ఞాన శాస్త్ర వేత్తల అభిప్రాయములు కొంతకాలానికి మారుతూ వుంటాయి. విజ్ఞానశాస్త్రంగా ఎన్నో అంశాలను గూర్చి పాతసిద్ధాంతాలను త్రోసిపుచ్చి క్రొత్త సిద్ధాంతాలను ప్రవేశ పెట్టుట కాలక్రమేణా జరుగుతూనే వుంటుంది.

ఒకప్పుడు అణువు అవిచ్ఛిన్నమైనదనే అభి అభిప్రాయంవుండేది. ఈనాడు అణువులో ప్రోటాన్లు న్యూట్రాన్లుతో కూడుకున్న న్యూక్లియస్ అనే కేంద్రం చుట్టూ ఎలక్ట్రాన్లు అనే విద్యుత్ కణములు నిర్ణీతమైన మార్గాలలో పరిభ్రమిస్తున్నాయని గ్రహించబడింది. ముందు ముందు ఈ అభిప్రాయంలో ఏమి మార్పు లోస్తాయో చెప్పలేము. ఒక అభిప్రాయము నిర్దుష్టమైనదని విశ్వసించకుండా, అన్వేషణ ఫలితంగా గ్రహించి సత్యముల నాధారము చేసుకొని అభిప్రాయమును మార్చుకొనుటయే సక్రమమైన పద్ధతి.

ఒకప్పుడు పదార్థము 'శక్తి' అనునవి అవ్యయము లనీ, వాటిని సృష్టించుట కాని నాశనముచేయుట కాని సాధ్యము కాదనీ వాటిని మార్చుట సాధ్యము కాదనీ సిద్ధాంతీకరింపబడింది: పదార్థమును శక్తిగానూ, శక్తిని పదార్థముగానూ మార్పవచ్చునని ఐన్‌స్టీన్ చేసిన ప్రకటన సంభ్రాంతి కలగజేసింది. శక్తి పదార్థముల పరస్పర పరిణామ పరిమాణములను తెలియజేయు సూత్రమును కూడా కనిపెట్టెను. ఇవన్నీ నిజమని రుజువు అయినట్లయితే మూల సిద్ధాంతము మార వలసివుంటుంది. 250 సంవత్సరముల క్రితమే సర్ ఐజాక్ న్యూటన్ 'పదార్థము శక్తిగానూ, శక్తి పదార్థముగానూ మార్పుచెందుట ప్రకృతిలోని వినోద ముగా కనబడుతుంది.' అన్నమాటలను ఈ సంద ర్భంలో గుర్తుచేసుకొనుట యుక్తము. అప్పట్లో ఆ మాటల విలువ గుర్తించివుండరు. కొందరు విజ్ఞాన శాస్త్రవేత్తలు న్యూటన్ మాటలను లిఖితపూర్వకంగా (An approach to modern Physics by E.N. Dac. Andrade E.L.B.S. Science To-day series 1962 PP.160) అనే గ్రంథంలో భద్రపరిచి నట్లు ఎరుగుదురు. ఆ మాటలు నిరాధారముగా కన బడి నప్పటికీ, విజ్ఞాన శాస్త్రవేత్తకి సత్యాసత్యముల విశ్లేషించి పరిశీలించుట సహజము. వివిధ అభి ప్రాయములను విశ్వాసములను నిశితంగా పరిశీలించ ఓర్పూనేర్పూ, వేదాంతికివలె, విజ్ఞానవేత్తకీ వుంటాయి

కాలక్రమేణా వైజ్ఞానిక ప్రయోగాల ఫలితంగా పదార్థము, శక్తి పరస్పరం రూపాంతరములు పొంది

ఎందుకు కష్టంగా ఉందీ అని - స్వామి అంటే నాకు ఎలాటి భయము, జంకు లేకపోయేవి. ఆ పసితనపు ధైర్యం. ఆయన నాకో మంచి స్నేహితుడనీ, దైవ స్వరూపులనీ మాత్రమే తెలుసు. కలిగినపు డల్లా ఏవో ప్రశ్నలు వేస్తూ ఎన్నో స్వామిని అడుగుతూ ఉండేవాణ్ణి. అంత ధైర్యంగా ఇప్పుడు ప్రవర్తించలేను.

నా ప్రశ్నకు స్వామి చటుక్కున సమాధానం చెప్పారు. "నీ పెరట్లోని మొక్కలను నీవు అకారణంగా బాధిస్తున్నావు కదా" అన్నారు స్వామి. మొక్కలు ఫిర్యాదు చేశాయా స్వామికి ?

అప్పటినుంచీ మొక్కలను పీకటం మరల నాటటం ఆపివేశాను. స్వామి చెప్పిన సమాధానంలో గల గాఢమైన తాత్త్విక ప్రాముఖ్యతను ఇటీవల వారంలోనే గుర్తించాను!

మొక్కలను హింసించే నాలోని రాక్షస స్వభావాన్ని స్వామి గుర్తించటం మొదటి విశేషం ఇది స్వామికి గల సర్వజ్ఞత్వాన్ని తెలియజేస్తుంది. మంచిని బోధించటంలో స్వామి ఉత్తమోత్తమ గురువులని కూడా దీనివల్ల తెలుస్తుంది. ఒక చిన్న మాటతో నాకు గల ఒక చెడ్డ అలవాటును స్వామి తొలగించారు. అంతేకాకుండా స్వామి సకల చరాచర జగత్తులోనూ సర్వభూతములయందు గల హృదయాధినేత అని కూడా దీనివలన ఋజువయింది. స్వామి అన్నింటి లోను ఉన్నారు. మొక్కలలో కూడా! అప్పటినుంచీ పొరపాటున కూడా ఏ ప్రాణినీ హింసించటం, కష్ట పెట్టటం మానుకుంటున్నాను స్వామి చెప్పే అహింసా ధర్మం సృష్టిలోని అట్టడుగు వాటికి కూడా వర్తిస్తుంది.

ఏది అవసరమో, ఏది ప్రయోజనకరమో స్వామికి బాగా తెలుసు. ఏది చేసినా, ఏమి చెప్పినా ఒక ప్రయోజనంతో స్వామి చేస్తారు, చెబుతారు. దేన్నీ స్వామి వృథా చేయరు. అవసరం అయితేనే స్వామి దేన్నైనా ఉపయోగిస్తారు. రైతు పంటను కోయటం, మోపులు కట్టటంలో తప్పు లేదు. అయితే ఆ పంటను తినేవాళ్ళు ఆ పనులు చేయరాదు. ఒక పురుగును సాలీడు చంపి తింటుంది, అది దానికి ఆహారం, జీవనం.

స్వామికి ఆ సాలీడు పురుగుమీద కోపం రాదు. కానీ వృథాగా మొక్కలను హింసించే నన్ను స్వామి మందలిస్తారు.

— S. శంకర్

(1978 వేసవి తరగతుల విద్యార్థి)

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2 | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4 | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5 | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 8. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారా | 2-00 | 0-25 |
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-30 |
| 11. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 14 | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం

## శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

### పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు  ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు [illegible]

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

(పుస్తక సూచి : 120 వ పుటలో చూడండి)

Regd. No. H/HD/354

MAY 1979

Licensed to post without Pre-payment No. H 8

[illegible] మనస్సు [illegible] మనస్సే ఆధ్యాత్మిక [illegible]. దీనికి ఆధ్యాత్మిక [illegible] అర్థము చేసి [illegible] అతి జాగ్రత్త వహించవలసి వస్తుంది. ఒక కొలను లోపల ఎంత చిన్న రాయి వేసినప్పటికిని ఆ రాయి పడినటువంటి స్థానములో చిన్న చిన్న అలలు తయారవు. ఆ అలలు మనకు కనిపించినను కనిపించక పోయినను ఆ కొలనంతా వ్యాపించిపోతుంటవి. అదే విధముగనే మన మానస సరోవరమునందు సంకల్పమనేటువంటి ఏ చిన్న రాయి వేసినప్పటికిని శరీరమంతయు ఇవి వ్యాపించి పోతుంటుంటాయి. చెడ్డ సంకల్పమే ఈ మనస్సనే కొలనులో వేస్తిమా చెడ్డ చూపే వస్తుంది; చెడ్డ పలుకే వస్తుంది; చెడ్డ శ్రవణమే చేస్తాయి; చెడ్డ ప్రదేశమునకే ఈ కాళ్ళు నడుస్తాయి. ఈ యొక్క చెడ్డ సంకల్పమనేది సర్వాంగములయందు ప్రవేశించి అన్ని చెడ్డ కార్యములయందే వానిని ప్రవేశింప చేస్తుంది. ఇందులో మంచి సంకల్పమే వేస్తిమా ఇది మంచి కార్యములందు సర్వేంద్రియములను ప్రవేశింప చేస్తుంది. మానసిక సముద్రమునే దానితో కట్టబడినటువంటిది మనుష్యుని జీవితము. కనుక ఇందులో [illegible] అలలకు అతీ [illegible] అటూ ఇటూ మనస్సు చలించి, మానవత్వానికే కోల్పోయి, దైవత్వములో ప్రవేశించక, దానవత్వములో ప్రవేశించి తనయొక్క దివ్యత్వాన్ని కూడను అపవిత్రము చేసుకుంటుంది. దీనిని పురస్కరించుకొనియే "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని. కనుక ఇట్టి మనస్సుయొక్క మర్మాన్ని మనము గుర్తించటమే నిజముగా మనము చేయవలసినటువంటి ప్రథమ కర్తవ్యము. మనస్సుయొక్క రహస్యాన్ని మనము గుర్తించినప్పుడు అదే మనకు మోక్షము.

— బాబా

with Registrar of Newspapers No. RN/10772/64.